# ఒక మాట

పరవళ్ళు తొక్కుతూ పొంగిపొరలే నదీ ప్రవాహాలవంటివి యువకుల ఉత్సాహోద్వేగాలు. ప్రవాహజలాలను ఆకట్టి పంట పొలాలకు మళ్లిస్తే దేశాన్ని సస్యశ్యామలం చేస్తాయి లేదా వెల్లువలై పారి దేశాన్ని ముంచెత్తి అపారనష్టాన్ని కల్గిస్తాయి. అదేవిధంగా యువజనుల శక్తియుక్తులను దేశప్రయోజనాలకు మళ్ళిస్తే దేశపురోభివృద్ధికి తోడ్పడతాయి లేదా అపమార్గాలలో పడి వృథా అయిపోవడమేకాక దేశభవిష్యత్తుకు ఎంతో హాని తెస్తాయి.

దేశభవిష్యత్తు ఉజ్వలంగా ఉండాలని కోరేవారెవరూ యువకులను ఉపేక్షించలేరు కాని దురదృష్టవశాత్తు నేడు అదే జరుగుతోంది. దేశానికి ఎంతో అమూల్యమైన యువక సంపద వ్యర్థమైపోతుంది. ఇది చాలా ప్రమాదకరమైన విషయం!

యువకులలో దేశభక్తి, జాతీయ చైతన్యం, సాంఘిక ప్రబోధం కల్గించకపోవడంవలన వారు ఉత్తమ పౌరులుగా తయారవడానికి బదులు చెడుమార్గాల్లో పడిపోతున్నారు. పట్టణాల్లో, పల్లెటూళ్ళలో అనేకమంది యువకులు దుర్వ్యసనాల పాలవుతున్నారు. విశృంఖల జీవితాలకు అలవడిపోతున్నారు. యువకులను నీచాభిరుచుల పాల్జేసే చవుకబారు సాహిత్యం, సినిమాల ప్రభావం ఎక్కువైంది.

ఇందు కనుగుణ్యంగానే సంఘంలో కలుషిత వాతావరణం పెచ్చుపెరిగిపోతోంది. సాంఘిక దురాచారాలు తిరిగి ప్రబలిపోతున్నాయి. స్వార్థం, పదవీవ్యామోహం, లంచగొండితనం, అవినీతి కులతత్వాలు రాజ్యం చేస్తున్నాయి. ఒక్క మాటలో జాతీయోద్యమ సత్సాంప్రదాయాలన్నీ మంటగలుస్తాయని చెప్పవచ్చు.

ఇటువంటి శూన్యస్థితిలో ప్రతీపశక్తులు తలయెత్తడం, తిరోగమన భావాలు స్వైరవిహారం చేయడం సహజం.

ఈ విపత్కరస్థితిని దేశభక్తులైన వారందరూ గుర్తించాలి. చైతన్యవంతులైన యువకులందరూ మేల్కొవాలి.

పురోగామి శక్తులకు ప్రథమశ్రేణిలో ఉండవలసిన విధంగా యువకులలో జాగృతి కల్గిస్తేనే కాని మన సమాజం, దేశం ముందుకు నడువలేవని గ్రహించాలి. అందుకు విశాల ప్రాతిపదికపై యువజనోద్యమాన్ని పునర్నిర్మించాలి.

ఇందుకు తోడ్పడే ఉద్దేశ్యంతోనే 'విశాలాంధ్ర' 1958 మే-అగస్టు నెలలమధ్య యువజనోద్యమ పునర్నిర్మాణావశ్యకతపై చర్చకు అవకాసం కల్పించింది. ఈ సందర్భంలో ప్రకటించిన వ్యాసావళిని పరికూర్చి ఈ పుస్తక రూపంలో మీకు అందిస్తున్నాం. యువజన సంఘాల నిర్మాణానికి ఈ వ్యాసావళి తోడ్పడగలదని ఆశిస్తున్నాం.

—పరకాల పట్టాభిరామారావు

'విశాలాంధ్ర'
విజయవాడ
24-10-58

•

# విషయసూచిక

# అభ్యుదయ కార్యక్రమం
## యువజన సంఘాలు

శ్రీ. జి. వి. నారాయణ
(ఆంధ్రరాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ కార్యదర్శి)

జాతీయ పునర్నిర్మాణంలో ఉధృతంగా దూసుకుపోతూ పురోగమించవలసిన యువకతరం నిరుత్సాహ వాతావరణంలో వుంది. నిరుద్యోగ సమస్య తాండవిస్తోంది. కుల, మత దురహంకార జాడ్యాలు ప్రబలంగా వున్నాయి. సంస్కరణోద్యమాలు తిరోగమనంలో వున్నాయి సమాజంలో కలుషిత వాతావరణం ఎక్కువ అయిపోతోంది. యువతీ యువకులు ఎవరిని ఆదర్శప్రాయంగా తీసుకోవాలో అర్థం కావడంలేదు. సమాజాభివృద్ధికి దోహదకరంగా వుండవలసిన సినీమాలు ఎక్కువభాగం కామోద్రేకాన్ని రెచ్చగొట్టేవిగా తయారవుతున్నాయి. జాతీయ భావాలను ఉన్నతాదర్శాలను పురిగొల్పే రచనలకు బదులు డిటెక్టివ్ సాహిత్యం చౌకబారు సెక్సు సాహిత్యం ప్రత్యక్ష మౌతున్నాయి.

బాల్య వివాహాలు తప్పనీ, వితంతు వివాహాలు జరగాలనీ పోరాటం జరిపిన వీరేశలింగం పంతులుగారివంటి సంస్క-

రణ వేత్తలు లోపించడం వల్లగాని, వివిధ రాజకీయ పార్టీల ఉదాసీనత మూలంగాగాని సాంఘికాభివృద్ధి తిరోగమనంలో వున్నది. అందువలన మళ్ళీ బాల్య వివాహాలు జరుగుతు న్నాయి; ఆడపిల్లలను కనడమే మహాపరాధమా యన్నట్లుగ ప్రబలివుంది వరకట్న సమస్య.

ఇక యువకుల పరిస్థితి ఎల్లాఉంది? గ్రామాలలోని, పట్టణాలలోని యువకులలో యువజన సంఘాలు పనిచేయనం దున వారిలో చెడు అలవాట్లు ఎక్కువైనాయి. పేకాట, జూదాలు, నైతిక బలహీనతలు బాధ్యతారహిత ప్రవర్తన ఎక్కువ అవుతున్నాయి. సమాజానికి దేశానికి ఉపయోగ పడవలసిన యువకులు. ఎందుకు కొరగాకుండా పోవడమే గాక సమాజానికి అప్రతిష్ట తెచ్చేవిధంగా దిగజారిపోతున్నారు.

ఒకనాడు యువజన సంఘాలు, బాలసంఘాలు యువకు లను ఆదర్శవంతమైన విధంగా తర్ఫీదు చేశాయి. యువకులను దురలవాట్లనుండి మరల్చడమే కాక వారిని శారీరకంగా, వైజ్ఞానికంగా, కళాత్మకంగా ఎంతో అభివృద్ధి చేశాయి ఎంతోమంది. నిపుణులైన ఆటగాండ్రు, కళాకారులు, ప్రజా సేవకులు గ్రామాలలో తయారయ్యారు. గ్రామజీవితంలో కొత్తవెలుగును, వికాసాన్ని ఈ సంఘాలు తీసుకొనివచ్చాయి.

నేడు యువజన సంఘాలు మూలబడటంవలననే యువ కులలో దేశభక్తి, సాంఘిక చైతన్యం, ప్రజాసేవాభిలాష తగ్గు తున్నాయి.

అందుచేత తిరిగి యువజనోద్యమాన్ని పునరుద్ధరించ వలసిన ఆవశ్యకత నేడు ఎంతైనాఉంది. పలుచోట్ల గ్రామాల్లో

యువజన సంఘాలు ఉన్నప్పటికి నామమాత్రావశిష్టంగా ఉన్నాయి. సమాజాభ్యుదయాన్ని ప్రధాన లక్ష్యంగా చేసుకొని యువజన సంఘాలను పునర్నిర్మాణం చేయాలి.

## గ్రా మ పు న ర్ని ర్మా ణ ం

రాజకీయ విభేదాలతో నిమిత్తం లేకుండా గ్రామ పునర్నిర్మాణం ప్రధాన లక్ష్యంగా యువజనసంఘం పనిచేయాలి. పంచవర్ష ప్రణాళికను గ్రామానికి అన్వయించుకొని ప్రణాళికా విజయానికి పాటుపడాలి. అభివృద్ధి ప్రణాళిక క్రింద రోడ్లు, మంచినీటి వసతి, పాఠశాలలు, వైద్యసహాయం, ఆటస్థలాలు, లైబ్రరీలు, వయోజన విద్యాకేంద్రాలు నెలకొల్పుతున్నారు. ఈ ప్రణాళికలను నిర్వహించే ఉద్యోగులకు ప్రజలతో సన్నిహిత సంబంధాలు లేక సరైన ప్రజాసహకారం లభించడం లేదు. అదే కారణంచేత దుబారాగూడ ఎక్కువ జరుగుతోంది. ఈ దుబారాను అరికట్టవలసిన బాధ్యత, ఈ గ్రామాభివృద్ధి ప్రణాళికలను రాజకీయ వివక్షతలు మాని జయప్రదంగా అమలు జరుపవలసిన బాధ్యత యువజనసంఘాల మీదవుంది. యువజనసంఘాలు జాతీయవిస్తరణ పథకాలను జయప్రదంచేయాలి. ఈ పథకాలు లేని గ్రామాల్లో యువజన సంఘాలు గ్రామ పునర్నిర్మాణానికి తగు కార్యక్రమం వేసుకొని పంచాయితీల ద్వారా, స్థానిక అభివృద్ధి ప్రణాళికల ద్వారా ఆ కార్యక్రమం అమలుజరుగునట్లు చూడాలి. గ్రామంలో విద్య, వైద్యసహాయం, పరిశుభ్రత మొదలైన సమస్యలలో గూడా యువజన సంఘాలు పనిచేయాలి.

## వ్యాయామం - ఆటల పోటీలు

మహాకవి గురజాడ "కండ గలవాడేను మనిషోయ్" అని అన్నట్లు యువకులు శారీరకంగా అభివృద్ధి పొందాలి. వ్యాయామము, ఆటలపోటీలు గ్రామగ్రామాన తిరిగిజరపాలి. మనకు క్రీడారంగంలో నైపుణ్యం గల్గినవారు అనేకమంది ఉన్నారు. ఆసియా రికార్డులు స్థాపించిన వారున్నారు. అటు వంటివారి సహాయ సహకారాలతో యువకులను తర్ఫీదు చేయాలి. ఆటస్థలాలు, ఆటవస్తువులు ప్రభుత్వ సహాయం ద్వారా పొందుటకు ప్రయత్నించాలి. తాలింఖానాలు పెట్టాలి.

## నాటకాలు-వైజ్ఞానిక ప్రదర్శనాలు

ఆంధ్ర దేశంలో గ్రామాల్లోను పట్టణాల్లోను ఔత్సాహిక నాట్యమండలులు ఎక్కువగానే ఉన్నాయి. ఢిల్లీలో నాటకఎకాడమీ పోటీలకు వెళ్ళిన దరఖాస్తులలో ఆంధ్ర నుండివెళ్ళిన దరఖాస్తులే ఎక్కువ. అఖిలభారత ప్రజానాట్య మండలి ఉత్సవాలు ఢిల్లీలో జరిగినప్పుడు కూడా ఆంధ్ర యువ కళాకారులు ఎక్కువ ఆదరణ పొందారు. ఇది హర్షించవలసిన విషయం. ఈ కళాసంప్రదాయాలను సుస్థిర ప్రాతిపదికపై అభివృద్ధి చేయాలంటే గ్రామ గ్రామాన తిరిగి నాటకాలు, వైజ్ఞానిక ప్రదర్శనలు ప్రారంభించాలి. అందులోంచి ఎంతోమంది ఉత్తమ కళాకారులు ఉద్భవించటం అప్పుడే సాధ్యం. యువకులు నాటకాలు వైజ్ఞానిక ప్రదర్శనలు ఇవ్వడానికి ముందుకు వచ్చినప్పుడే ఉత్తమ

నాటకాలు, నాటికలు జానపద కళారూపాలు రచించ డానికి ప్రోత్సాహం లభించుతుంది. ఈనాడు సంఘంలో ఉన్న దురాచారాలన అభివృద్ధి నిరోధక భావాలన దండెత్తి వాటిని నిర్మూలించడానికి వైజ్ఞానిక కార్యక్రమాలను ప్రధాన ఆయుధంగా యువజన సంఘాలు చేయాలి. యువకులపై చవుకబారు సినీమాల, రచనల ప్రభావాన్ని తొలగించాలి.

## నిరక్షరస్యతా నిర్మూలన

మనదేశంలో చదువు సంధ్యలు తక్కువ. నిరక్షరాస్యులు ఎక్కువ. నిరక్షరాస్యతను తొలగించడం జాతీయ పునర్నిర్మాణ కార్యక్రమాల్లో ఒక ప్రధాన కార్యక్రమం. ఈ కర్తవ్యం నిర్వహించవలసిన బాధ్యత ముఖ్యంగా యువకుల మీదనే ఉంది. చదువుకున్న ప్రతీ యువకుడు, యువతీ చదువురాని తోటివారికి రోజుకు కనీసం ఒకగంట చదువు నేర్పాలి. గ్రామగ్రామాన వయోజన విద్యాప్రచారాన్ని నడపాలి. యువజనసంఘ కార్యక్రమంలో ఇదొక ప్రధాన కార్యక్రమంగా తీసుకోవాలి. గ్రంధాలయాలను ఆదర్శవంతంగా నడపాలి.

## సాంఘిక సంస్కరణలు

సాంఘిక సంస్కరణలపట్ల ఉపేక్షాభావం ఏర్పడటం వలన ఏ సాంఘిక దురాచారాలను మనం ఖండించుచున్నామో అదే ఈనాడు మనలను పీడిస్తున్నాయి. వరకట్నాల నిషేధ చట్టం చేయబడినప్పటికీ సమాజంలో ఈ సమస్య విషమ

సమస్యగా ఉంది. దీనిని నిర్మూలించాలంటే యువజన సంఘాలు పెద్దయెత్తున ప్రచారం చేయాలి. ఆచరణలోకి దిగాలి. స్త్రీలకు సంఘంలోఉన్న అస్వతంత్రతలను, పరాధీనతను తొలగించాలి. స్త్రీల వారసత్వహక్కు చట్టం అమలు జరిగేటట్టు చూడాలి.

అన్ని రంగాలలోను కులతత్వం ఈనాడు పెచ్చు పెరిగి పోయింది. ఇటువంటి సంకుచిత భావాలను నిర్మూలించనిదే మనదేశం పురోగమించడం సాధ్యంకాదు. వర్ణాంతరవివాహా లకు ప్రోద్బలం యివ్వడంద్వారాను విశాల జాతీయభావా లను దేశభక్తిని పురిగొల్పుట ద్వారాను, సోషలిస్టు భావా లను వ్యాపింపజేయుట ద్వారాను ఈ సంకుచిత తత్వాలను రూపుమాపాలి. మిగిలివున్న అస్పృశ్యతను పారద్రోలాలి.

## సోషలిస్టు సమాజ నిర్మాణం

ప్రపంచశాంతి సోషలిస్టు సమాజనిర్మాణం ప్రధాన లక్ష్యాలుగా మనం ముందుకు సాగాలి. ఈ ఆశయాలు సాఫల్యం కావాలంటే స్వతంత్ర ఆర్థిక వ్యవస్థ నిర్మించు కోవాలి. వలస ఆర్థిక విధానము, ఫ్యూడల్ వ్యవస్థ నిర్మూ లించబడాలి. వ్యవసాయ సంస్కరణలు, పారిశ్రామికాభివృద్ధి ఇందుకు ప్రధానమార్గాలు. అందుచేతనే ఇవి నేడు జాతీయ కర్తవ్యాలుగా మారాయి. ఇవి పాక్షిక రాజకీయ కోర్కెలు కావు.

ద్వితీయ పంచవర్ష ప్రణాళికను జయప్రదంగా అమలు జరిపించుటకు గ్రామాల స్థాయిలో అభివృద్ధి ప్రణాళికలు నిర్వ హించుటకు యువజన సంఘాలు తమవంతు కర్తవ్యాన్ని నిర్వ

హించాలి. ఇందుకు అడ్డంకుగా ఉండే శక్తులను, అభివృద్ధి నిరోధకులను ప్రతిఘటించాలి.

జాతీయ పునర్నిర్మాణాని కనుగుణ్యంగా విద్యా విధానాన్ని మార్చాలని యువజన సంఘాలుకూడా ఆందోళన చేయాలి. ఎందుకంటే విద్యావిధానం దేశపునర్నిర్మాణానికి కావలసిన ఇంజనీర్లను, సాంకేతిక ప్రవీణులను, వ్యవసాయ శాస్త్ర నిపుణులను, వైద్యులనుకాక గుమాస్తాలను మాత్రం తయారుచేస్తోంది. నిరుద్యోగులను ఉత్పత్తి చేస్తోంది. గ్రామాల్లో చదువుకున్న యువతీ యువకులు అనేకమంది నిరుద్యోగులుగా ఉంటున్నారు. ఈ దుస్థితి తొలగాలంటే దేశపునర్నిర్మాణాని కనుగుణ్యంగా యువతీ యువకులను తర్ఫీదు చేయాలని ఆందోళన చేయాలి.

యువకులను భావి పౌరులుగా, దేశభక్తులుగా, ఉత్తమ ప్రజాసేవకులుగా తయారు చేయవలసిన మహత్తర కర్తవ్యం యువజన సంఘాలను నిర్మించనిదే నెరవేరదని గత కొలది సంవత్సరాల చరిత్ర రుజువు చేసింది. యువజన సంఘాలు లేక పోబట్టే యువక శక్తులు దుర్వినియోగ మాతున్న సంగతి కూడా ప్రత్యక్షంగా చూస్తున్నాము. అందుచేత దేశశ్రేయోభిలాషులు, రాజకీయ పార్టీలు, రచయితలు, క్రీడా నిపుణులు, కళాకారులు అందరూ తిరిగి యువజనోద్యమాన్ని పునరుద్ధరించడానికి చేయూత యివ్వాలి.

అనేక ప్రాంతాల్లో యువజన సంఘాలున్నాయి. కాని ఉత్సాహకరమైన కార్యక్రమం లేక, పటిష్టమైన నిర్మాణం లేక అవి నామమాత్రంగా వున్నాయి. కొన్ని కొన్ని

ప్రాంతాల్లో యువజన మహాసభలు జరుపుతు, తిరిగి సంఘా లను పని చేయించడానికి కృషి ద్విగుణీకృతంగా సాగించడానికి తగు కార్యక్రమాన్ని నిర్ణయించుకోడానికి యువజన సోదరులు పూనుకోవాలి. ఉద్యమ కర్తవ్యాలపైన కార్యక్రమంపైన చర్చలు జరపాలి. కార్యరంగంలో దిగాలి.



•

# ఐక్య యువజనోద్యమావశ్యకత

శ్రీ వాసిరెడ్డి సత్యనారాయణ
(ఆంధ్రప్రదేశ్ విద్యార్థి కాంగ్రెస్ మాజీకార్యదర్శి)

మనం స్వతంత్రం సంపాదించుకొని ఇప్పటికప్పుడే పది సంవత్సరాలైంది భారతావని భవితవ్యాన్ని తీర్చిదిద్దుకోవాలనే ఆకాంక్షతో ఒక పంచవర్ష ప్రణాళికను ముగించుకొని రెండవ ప్రణాళికను అమలు జరుపుకొంటున్నాం సోషలిస్టు సామాజిక వ్యవస్థే మన లక్ష్యంగా పార్లమెంటు తీర్మానం ద్వారా ప్రకటించుకొన్నాం. ప్రపంచ శాంతిని పెంపొందించే బాటలో మన విదేశాంగ విధానం రూపొందించుకొని అందరి మన్నన లందుకొంటూ శాంతియుత సహజీవనం సాగిస్తున్నాం. అంతర్జాతీయ రంగంలో ఎనలేని పేరు ప్రతిష్ఠలు సంపాదించుకొన్నాం. యావత్ప్రపంచానికీ 'పంచశీల' సిద్ధాంతాన్ని అందించాం. వలస ప్రజలకు బాసటగా ఉంటున్నాం. మొత్తంమీద మనదేశం ప్రగతి పథంలో పురోగమనం సాగిస్తున్నదన్న ఆనందం పొందుతున్నాం.

మరోవైపున ఈ పురోగమనాన్ని తిరోగమనం పట్టించేందుకు అభివృద్ధినిరోధక శక్తులు మనమధ్యనే ఉండియత్నిస్తున్నాయి. జాతిని పెడత్రోవను బట్టించే ధోరణులు ప్రబలు

తున్నవి. వీటన్నింటిని అధిగమించి, మన జాతీయ ప్రయోజనాలను కాపాడుకొనేందుకు, మన ఉత్సాహాలను సాధించుకొనేందుకు యావజ్జాతీ కదలి పనిచేయవలసి యున్నది. ముఖ్యంగా యువతీయువకులు నవభారత నిర్మాణంలో ప్రముఖపాత్ర వహించవలసి యున్నది.

## యువజనోద్యమం నేడున్న స్థితి

అయితే దురదృష్టవశాత్తు ఈనాడు ముఖ్యంగా మన రాష్ట్రంలో యువజనోద్యమం నిస్తబ్దమై నిద్రాణమై యున్నది. యువజన కాంగ్రెసు ఉన్నదంటున్నారుగాని ఎచ్చటా కనిపించటం లేదు. సభ్యత్వం స్వీకరించి పనిచేయాలన్న ఆకాంక్ష వుండి ప్రయత్నించిన వారికికూడా దానిజాడలు కనిపించటం లేదు. యువజన ఫెడరేషను నిద్రపోతూనే ఉన్నది. ఆమధ్య కాస్త చురుకుగా కనిపించిన యువకర్షక సమితి కార్యకలాపాలు కూడా ఎచ్చటా కనిపించటంలేదు. ఆ సమితి ఆధ్వర్యాన అనేక ఒడుదుడుకులకు లోనౌతూ ఒక మాసపత్రిక ఎలాగో ప్రచురించ బడుతున్నది. అంతవరకు సంతోషించవలసిందే. భారత సేవక్ సమాజ్ శాఖ అయిన యువక్ సమాజ్ మన రాష్ట్రంలో నామమాత్రంగా కూడా లేదు. అచ్చటచ్చట గ్రామస్థాయిలో, తాలూకా స్థాయిలోమాత్రం యువజన సంఘాల నిర్మాణం జరుగుతున్నది. అవైనా- బహు తక్కువ ప్రాంతాలలోనే. తెలుగు పత్రికలలో యువజనుల కర్తవ్యాలను ప్రబోధించడానికి ఏవీ పూనుకొనటం లేదు.

## ప్రబలిపోతున్న అనర్థకాలు

ఈ పరిస్థితి ఎన్నో అనర్థకాలకు దారితీస్తున్నది. ఈనాడు యువకశక్తి వృథా అయిపోతున్నది. అంతేకాదు. పెడమార్గాలుబట్టి సమాజానికి భావి అభ్యుదయానికి ఆటంకంగా, నిరోధకంగా పరిణమిస్తున్నది. బస్తీలలోగాని పల్లెలలోగాని ఆ విధంగా చెడుదారిదొక్కే సంఘటనలు చెదరువాటుగాగాక మన భవిష్యత్తుకే హెచ్చరికగా, భయానకంగా అగుపిస్తున్నవి. ప్రతి బస్తీలోనూ అసంఖ్యాకంగా 'క్లబ్బులు' వెలుస్తున్నవి. వాటిలో విజ్ఞాన వినోద కార్యకలాపాలకు తావులేదు. పేకాటలతో జూదగృహాలుగా, కొందరు "పెద్ద మనుషుల" ఘరానా వ్యాపారంగా సాగిపోతున్నవి. రాజకీయరంగంలో ఉంటున్నవారే, దేశానికి జాతికి ఏదో చేస్తున్నామని ప్రగల్భాలు పలుకుతున్నవారే అలాంటి వాటిని స్థాపించిన సందర్భాలు కొల్లలు అంతకంటే బాధ్యతగల "పెద్దలే" అలాంటి జూదగృహాలను పోలీసు అధికారులు పట్టుకోకుండా అడ్డుపడుతున్న సంఘటనలుకూడా ఉన్నవి. ఈ "నీతి నిర్మూలన" కార్యక్రమమంతా సాగించే క్లబ్బులు జాతీయనాయకుల పేర్లమీద స్థాపించబడి రిజిష్టరు చేయబడటం మరీ విచారకరం. ఈ ఘరానా వ్యాపారం సాగించే "పెద్ద మనుషులు" అసంఖ్యాకంగా అమాయకులను పేకాటలకు దించుతున్నారు. ఈ విధమైనవి బస్తీలకే పరిమితం కాలేదు. కాస్త చెప్పుకోదగ్గ ప్రతి పెద్ద గ్రామానికి వ్యాపించినవి. మరీ చిన్న గ్రామాలలో అంతకంటే చిన్నతరహాలో సాగితున్నవి.

కాటన్‌మార్కెటు జూదం విచ్చలవిడిగా సాగు తున్నది. పల్లెలకుకూడా వ్యాపిస్తున్నది. దీనివలన ఎందరో యువకులు అణగారిపోతున్నారు. ఉన్న కాస్తకూస్త ఆస్థి పాస్తులు పోగొట్టుకొంటున్నారు. దినమెల్ల కష్టించి సంపాదిం చినది కూడా కడుపుకట్టుకొని, భార్యాపిల్లలను పస్తులుంచి ఈ జూదాలకర్పించి చిక్కి శల్యావశిష్టమై పోతున్నారు. మానసి కంగా దెబ్బతిని మతిభ్రష్టులై పోవటం జరుగుతున్నది. దీని వలన బాగుపడుతున్నది జూదాన్ని నడిపే ఏజెంట్లు వారివద్ద భాగం పంచుకొనే లంచగొండి పోలీసులు మాత్రమే. ఎన్నెన్ని కుటుంబాలు ఈదురవాటుకు బలియైపోతున్నవో లెక్కలేదు.

## త్రాగుడు

జూదాలకు, పేకాటలకు అలవాటైనమీదట క్రమంగా మనశ్శాంతి పేరిటనో, ఉల్లాసానికనో త్రాగుడుకూ అలవడు తున్నారు. మద్యనిషేధం కాగితాలమీదనేగాని ఆచరణలో ఎచ్చటాలేదు. గాంధిమహాత్ముని వారసత్వమంతా గుత్తకు గొన్నట్లు మాట్లాడే అనేకమందికి హైక్లాస్ మద్యపానీయాల వ్యాపారాలతో, ప్రత్యక్షంగానో పరోక్షంగానో సంబంధం ఉంటూనేఉన్నది. వేదికలెక్కి "మద్యపానం పంచ మహా పాతకాలలో ఒకటి" అని వల్లించేవారూ ఘరానాగా త్రాగి తందనాలాడుతున్నారు. ఇక హైద్రాబాదు నగరంలో సరే సరి. "అదేమంటే నిషేధం లేదుగా" అనవచ్చుకూడా.

## వ్యభిచారం

వీటన్నింటికి తోడు వ్యభిచారం. జాతీయ నాయకుల పేరసాగేక్లబ్బులలోకూడా వ్యభిచారం ఒకభాగంగా సాగిపోతు

న్నది. ఈ దుర్వ్యసనం ఈనాడు సంఘంలో ప్రబలియున్న వాట న్నింటిలోకీ మరీ వికృత స్వరూపం దాల్చింది. విద్యార్థులలో, యువకులలో ఆత్మనిగ్రహశక్తి లోపిస్తున్నది. ప్రతి బస్తీలోనూ ఇంతమంది పోలీసు ఉద్యోగులున్నా వ్యభిచారం చట్టసమ్మతం కాకపోయినా సాగుతూనే ఉంది. ఇంత విచ్చలవిడిగా వ్యభి చారం సాగటానికి మూలకారణం ఆర్థిక పరిస్థితులు, సమాజం లోని ఆర్థిక నిమ్నోన్నతాలను చక్కబరచి దుర్భర దారి ద్ర్యాన్ని పారద్రోలి ప్రతివ్యక్తికి స్త్రీ పురుష విభేదం లేకుండా శ్రమచేసేందుకు తద్వారా జీవనభృతి సంపాదించుకోనేందుకు అవకాశం కల్పించిననాడు వ్యభిచారంయొక్క పునాదులే కదలిపోతవి. దానికితోడు యువతీయువకులలో నైతిక ప్రమా ణాలు పెంపొందించుటకు కృషి చేయటం ద్వారా నైతిక ప్రమాణాలను నిలబెట్టవచ్చు. వృద్ధబాల్య వివాహాలు ప్రేమతో నిమిత్తం లేకుండా, వధూవరుల పరస్పర అవగాహన అంగీకారాలు లేకుండా బలవంత బ్రాహ్మణార్థంగా చేసిన పెండ్లిండ్ల ఫలితంగా కుటుంబజీవితాలు సాఫీగా నడవక తప్పు దారులు త్రొక్కే ప్రమాదంవుంది

దురలవాట్లకు అవసరమైన డబ్బు కోసం చివరకు దొంగ తనాలకు తయారుకావటం, నేరాల కలవడటంకూడా చూస్తు న్నాం.

## చదువుకొన్నవారూ ఇంతే!

ఈ దురలవాట్లన్నీ కేవలం చదువు సంధ్యలు లేని అమాయకులే సాగిస్తున్నారా అంటే లేదు. బాగా చదువు

కొన్నవారు, డిగ్రీలు సంపాదించినవారు సయితం వీటికి బలై పోతున్నారు. మొదట కాలక్షేపం పేరుతో ప్రారంభించి, అదొక అలవాటుగా, వ్యసనంగా పరిణమించి పచ్చని లేత కాపురాలెన్నో ఛిద్రమైపోతున్నవి. యువకకుటుంబ జీవితాలలో ఆనందోత్సాహాలు సన్నగిల్లిపోతున్నవి. తద్వారా మరింత తప్పుత్రోవలు త్రొక్కటం సంభవమవుతున్నది. ఈనాటి చదువులలోనే నైతిక విలువలు బోధించేందుకు అనువైన వాతావరణం రావాలి. అన్ని దురలవాట్లకు దారితీసే నిరుద్యోగానికి తావులేని రీతిన విద్యావిధానం మారాలి. అందాకా చదువుకొన్న వారుకూడా ఇంతే

## సాంఘిక దురాచారాలు కులతత్వం

కులతత్వం క్రిందినుండి పైదాకా జీర్ణించుకొనిపోయింది ఎన్నికలలో వోట్లు సంపాదించుకోడానికి కులతత్వం పనిచేస్తున్నది. ఉద్యోగ నియామకాల దగ్గరకొచ్చేసరికి యిది మరింత వెర్రితలలు వేసింది. ఉద్యోగ నియామకాధికారం ఎవరిచేతిలో ఉందో ఆ అధికారి కులానికి చెందిన వారికేతప్ప ఇతరులకు న్యాయంజరగదు. ఇందులోనూ బంధు ప్రీతికి ప్రథమస్థానం లభిస్తుంది. యువజనులలోనూ ఈ కులతత్వజాడ్యం ప్రబలంగా అల్లుకొనియుంది కులతత్వానికున్న ప్రాబల్యాన్ని తక్కువ అంచనా వేసేందుకు వీలేలేదు. ఈ కులతత్వం రాజకీయసిద్ధాంత విశ్వాసాలను అధిగమించి తననంటిపెట్టుకొని జూస్తున్నది. ప్రజలపాలిట మత్తుమందుగా కులాలూ మతాలూ భయంకర స్వరూపం దాల్చినవి.

తగినంత రాజకీయ చైతన్యం పెంపొందిననాడే ఈ జాడ్యాలకు అంతం. వర్ణాంతర వివాహాలద్వారా క్రమేణా కులమత రహిత సమాజస్థాపనకు పూనుకోవాలి.

## వ ర క ట్నా లు

మన సమాజాన్ని కలవర పరుస్తున్న మరో ప్రధాన సమస్య వరకట్నాల సమస్య. సిద్ధాంతరీత్యా ఎంతజెప్పినా, లేక శాసనాలు చేసినా ఈ సమస్య పరిష్కారంకాదు. తలిదండ్రుల ఆస్థిపాస్తులలో కుమారులతో బాటు కుమార్తెలకు సమాన హక్కులు సంక్రమింప జేసినపుడే ఈ సమస్య నిజంగా పరిష్కారం అవుతుంది. అంతదాకా చట్టాల మాటున తెర వెనుక భాగవతాలు తప్పవు. సమాజంయొక్క స్వరూపం మారి యువతీ యువకులు పరస్పరావగాహన ద్వారా పరస్పరాంగీకారం ద్వారా వివాహాలు చేసుకొనే స్థితి రావాలి. జపానువంటి దేశాలలో ప్రభుత్వాలు ఇందుకు సమస్తావకాశాలు కల్పిస్తున్నవి. ఈ విషయంలోకూడా సామాజిక బంధాలను త్రెంచుకొని ముందుకు రావలసినవారు చదువుకొన్న యువతీ యువకులే !

## స్త్రీ ల ప రా ధీ న స్థి తి

తరతరాలుగా స్త్రీలు పురుషుల క్రింద అణగి మణగి యుండవలసిన బానిసలుగానే వ్యవహరింప బడుతున్నారు. అలా ఉండటమే ఆదర్శంగా పురాణాలన్నీ పురికొల్పుతున్నవి. సమాజం సమర్థిస్తున్నది. స్త్రీలు పురుషుల సంపాదన మీదనే

ఆధారపడియుండటం, స్త్రీలకు ఆస్థిహక్కులు సమగ్రంగా లేక పోవటం వల్లనే ఇంట్లో స్త్రీ చేస్తున్న చాకిరంతా నిజానికి లెక్కలోకి తీసుకోనటమే జరగటం లేదు. స్త్రీల శారీరక నిర్మాణదృష్ట్యా వారికి విశ్రాంతి హెచ్చుగా కావలసియున్నా ఆచరణలో మాత్రం మరో విధంగా ఉంటున్నది. స్త్రీ పురుషులిరువురూ కాయకష్టంచేసుకుని జీవించే కుటుంబాలలో స్త్రీలు బానిసత్వంనుండి బయట పడ్డారు. ధనిక, మధ్యతరగతి కుటుంబాలలో సయితం స్త్రీపురుషుల సమానత్వం గుర్తింప బడి ఆచరణలో అగుపించాలి ఈ విషయంలోనూ యువ కులు, ముఖ్యంగా విద్యావంతులైన యువకులు తమ భార్య లను బానిసలుగా కాక జీవితంలో సమాన భాగస్వామినులుగా చూడడం నేర్చుకోవాలి.

ఇంకా అక్కడక్కడ బాల్యవివాహాలు జరుగుతూనే ఉన్నవి. ధనంచూపి నవయువతులను కాటికి కాళ్ళుచాచిన ముదుసళ్ళకు ముడివేయటం కనిపిస్తూనేఉన్నది. పునర్వివాహ ఉద్యమాన్ని కీ॥ శే॥ వీరేశలింగం పంతులుగారు ప్రారంభించి చాలా కాలమైనా ఇంకా చాలాప్రాంతాల్లో తప్పుగానే పరిగణించబడుతుంది. అంటరానితనం పల్లెటూళ్ళలో ఇంకా రూపుమాయలేదు. ఈఅనర్థకాలన్నింటినీ తొలగించటంలో యువకులు పాల్గొనవలసిన అవశ్యకత ఎంతైనా ఉంది.

## యువజనోద్యమ ఆవశ్యకత

ఈ అనర్థకాల నివారణకు, యువకశక్తిని సక్రమ మార్గానికి మరల్చి దేశపునర్నిర్మాణంలో, సాంఘిక దురా

చారాల నిర్మూలనలో నిర్విరామ కృషి చేసేందుకు ఈనాడు యువజనోద్యమ నిర్మాణం ఎంతైనా అవసరం. దేశభక్తి గల, చిత్తశుద్ధిగల ఏరాజకీయపార్టీ అయినా కాసీయండి స్వైరవిహారం చేస్తున్న ఈ చెడుగులను పారద్రోలి యువశక్తి సక్రమ మార్గానికి మరలించటంలో శక్తివంచన లేకుండా కృషిచేయవలసి యున్నది. రాజకీయ సిద్ధాంత, ఆశయవిభేదాలను తాత్కాలికంగా ఆవలద్రోచి, విశాలమైన ప్రాతిపదికల మీద పటిష్టమైన యువజనోద్యమాన్ని నిర్మాణం చేయవలసిన అవసరం ఈనాడెంతైనా ఉంది. ఈ విషయంలో ఆలస్యం జరిగినకొలదీ పరిస్థితులు మరింత విషమ స్వరూపం దాల్చేట్లున్నవి. గోటితో గిల్లి పారవేయవలసింది గొడ్డలితో నరకవలసినంతదాకా ఈ చెడుగులను పెరగనిచ్చాం. ఇప్పటికైనా మేల్కొని వాటిని అరికట్టకపోతే భవిష్యత్తుకే ప్రమాదం.

## తక్షణ కర్తవ్యాలు

ఈ దశలో రాజకీయపార్టీ కొక యువజన సంఘం స్థాపించుకొనేకంటే సోషలిస్టు భావాలు, దేశభక్తిగల యువకులంతా ఏకైక వేదిక నిర్మించుకొనటం మరింత ప్రయోజనకారి కాగలదు. విభిన్న రాజకీయాభిప్రాయా లున్నంత మాత్రాన కలిసి పని చేసుకోలేమని భయపడ నవసరంలేదు. తీవ్రరాజకీయ భేదాభిప్రాయాలున్నా కలిసి పని చేసుకోవచ్చునసేది ఇదివరకే అనేక సందర్భాలలో ఋజువైంది. ఆంధ్రరాష్ట్ర సాధనోద్యమంలో, గోవా విమోచనోద్యమంలో, విశాలాంధ్ర సాధనా కృషిలో విభిన్నాభి ప్రాయాలుగల విద్యార్థి

సంఘాలు యువకులు కలిసి పనిచేయటం మనకు తెలుసు. గత సంవత్సరమే విద్యార్థుల తక్షణ కోర్కెల సాధనకు విద్యార్థి కాంగ్రెసు, విద్యార్థి ఫెడరేషను కలిసి కృషిచేసి కొంతవరకు విజయాలను సాధించటంకూడా జరిగింది. చిత్తశుద్ధి, లక్ష్యశుద్ధి ఉన్నంతవరకూ, అంగీకృత కార్యక్రమాలతో కలిసి పనిచేయడానికి ఎంతటి తీవ్ర రాజకీయ విభేదాలైనా అడ్డు రావనేది ఆ సందర్భంలో అనుభవాన్నిబట్టి తేలింది. ఎవరికైనా సిద్ధాంతరీత్యా విశ్వాసాలు సడలితేనో, మరేవైనా కారణాలుంటేనో తప్ప కలిసి పనిచేసిన ఏ రాజకీయ వర్గానికీ నష్టం రాదు, హాని జరగదు. పైగా ప్రతిష్ట పెరుగుతుంది.



# యువకులు : గ్రామాభ్యుదయ పథకాలు

శ్రీ కె. సంజీవరావు

నేడు జాతీయ విస్తరణ ప్రాంతాలలోని గ్రామాలలో యువకులు యువజన సంఘాలు పెట్టుకొని, వారు నాలుగవ వంతు, వారి పంచాయితీ నాలుగవవంతు మొత్తం సగం భరించినట్లయితే, జాతీయ విస్తరణ కేంద్రంవారు మిగతా సగం మంజూరుచేసి వాలీబాలు, ఫుట్ బాలు, బ్యాట్ మెంటన్, రింగుటెన్నిస్, కేరమ్స్, మొదలైన ఆటలకు సంబంధించిన అన్ని వస్తువులు కొనుక్కొనే అవకాశం కల్పించుచున్నారు. హార్మోనియం, తబల, మద్దెల, సితారా, మౌత్ అర్గన్, బుల్ బుల్ మొదలైనవి కొని భజనమందిరాలు నడుపుకోవచ్చు. నాటకసమాజాలు ఏర్పాటు చేసుకొని వాటికి కావలసిన పరికరాలన్నీ సమకూర్చుకోవచ్చు. వికాసకేంద్రాల ఆధ్వర్యాన జరిగే ఆటల వైజ్ఞానిక పోటీలలో పాల్గొని శక్తియుక్తులను ప్రదర్శించి బహుమతుల నందుకోవచ్చు. వీటి ద్వారా యువకులను ఎన్నోవిధాల అభివృద్ధి చేయవచ్చు. గ్రామవికాసమునకు తోడ్పడే అభివృద్ధి కార్యక్రమాల

నెన్నింటినో అమలు జరపటానికి వికాస విస్తరణ కేంద్రాల ద్వారా ప్రభుత్వం కృషి చేస్తున్నది. ఉపయోగించుకొనేవారు లేక అభివృద్ధి కార్యక్రమాలకు కేటాయించిన నిధులు మురిగి పోతున్నవి.

సాయంసమయంలో గ్రామములలోని యువకులందరూ ఒకచోట చేరి సమిష్టిగా కాలక్షేపం చెయ్యటానికి తద్వారా పరస్పర సన్నిహితత్వం పెంపొందించు కొనటానికి గాను ప్రభుత్వం వారిచ్చే ఆర్థికసహాయాన్ని వినియోగించుకొని అరుగులు వేసుకోవచ్చు. బాలానంద కేంద్రాలు స్థాపించి బాల బాలికల వినోద వికాసాలకు అవకాశాలు కల్పించవచ్చును. రీడింగురూము, లైబ్రరీలు నిర్మించుకొని పుస్తకాలు పత్రికలు తెప్పించుకోవచ్చు. ప్రభుత్వమిచ్చే ఆర్థిక సహాయాన్ని విని యోగించుకొని మంచినీటి బావులు త్రవ్వించుకోవచ్చు, బావులకు పళ్ళాలు కట్టించుకోవచ్చు. అంతేకాకుండా స్కూలు బిల్డింగులు కట్టించటానికి, పొగచూరని పొయ్యిలు కట్టించు కోవటానికి, నవీనపద్ధతులలో పాయఖానాలు దొడ్లలోకట్టించ టానికి సింగల్ పట్టాలున్న రైతులకు అప్పలివ్వటానికి యక్స్ పర్ మెంటల్ ఎరియాస్ క్రింద కాయగూరల, వరి, జొన్న విత్తనాలు, వాటికి కావలసిన ఎరువులు వ్యవసాయ శాఖ వారిచే యిప్పించటానికి యీ పథకాల క్రింద అవకాశా లున్నవి. మంచి జాతి ఆబోతులను, ఎనుబోతులను కూడా యిస్తున్నారు. వీని నుపయోగించుకొనే నాథుడు లేడు. ఉద్యోగస్తులు ఏదోవిధంగా కోటా పూర్తిచేసుకు పోదామని వారికి కొద్దిగా పరిచయమైన గ్రామాలకొచ్చి బ్రతిమ

లాడుకొని ఏదోకొన్ని పనులు ఏదోవిధంగా పూర్తిచేసుకొని పోతున్నారు.

## గ్రామాలకు యువ నాయకత్వం

వారే గ్రామ నాయక శిబిరాలు నడుపుతున్నారు. ఆ శిక్షణ మన యువకులకెంతో అవసరం. యువకులను గ్రామ నాయకులుగా తయారుచేయటానికి ఆ శిక్షణ ఎంతో ఉప యోగ పడుతుంది. కానీ పాక్షిక రాజకీయ దృక్పథాలతోనో, సోమరితనం వల్లనో వాటి ప్రాధాన్యత తెలియకనో అధికా రులు యింట్లకొచ్చి ఆహ్వానించినా అనేకమంది ఆ శిక్షణ శిబిరాలకు వెళ్ళటంలేదు ఇదెంతో విచారకరమైన విషయం.

## సమాజవికాస కేంద్రాలలో తక్షణ కర్తవ్యం

సామాజిక విస్తరణ, వికాస కేంద్రాలలోని గ్రామాల యువజన సంఘాలు వెంటనే నిర్మాణమై, కదిలి, పంచాయి తీల సహాయంతో ఆటవస్తువులు, భజనమందిరాలు, నాటక సమాజాల పరికరాలు సమకూర్చుకొని యువజనాభ్యున్నతికి కృషి చెయ్యాలి యువజనులనుకూడా సంఘాలలో చేర్చుకో వటంఅవసరం. యువజనసంఘం తరపున తెప్పించి ఆటవస్తువు లలో కేరమ్స్‌లాంటి ఇండోర్ ఆటవస్తువులు వారికి ప్రత్యే కించాలి. గ్రామాలలోని సాంఘిక దురాచార వ్యతిరేక పోరా టాలలో పాల్గొని గ్రామాభివృద్ధికి తోడ్పడాలి.

స్థానిక పంచాయితీలతో సహకరించి సామాజిక వికాస విస్తరణ పథకాలక్రింద ప్రభుత్వం మంజూరుచేస్తున్న

నిధులను సంపూర్ణంగా వినియోగించుకొని గ్రామాలలో రేడియో, రీడింగురూము, లైబ్రరీ, స్కూలు, పంచాయితీ ఆఫీసు బిల్డింగులు కట్టటానికి; రీడింగురూము, లైబ్రరీలలో పత్రికలు, పుస్తకాలు ఏర్పాటు చేయుటకు, అరుగులు వేయుటకు, బాలానంద కేంద్రములు నెలకొల్పుటకు, గ్రామ సౌకర్యములకొరకు శ్రమదానముచేసి రోడ్లు, బావులు, పంచాయితీలచేత ఏర్పాటు చేయించుకొనటానికి నేడు ఛిద్రమైన గ్రామాలను ఆదర్శవంతమైన గ్రామాలుగా నిర్మించటానికి కృషి చేయవలసి యున్నది.

అప్పుడు యువకులు గ్రామనాయకులుగా తయారవుతారు. దురాచారాలను పోగొట్టగలుగుతారు. ముఠా రాజకీయాలను అంత మొందించగల్గుతారు. యువజన ఐక్య వృద్యమాన్ని నిర్మించగల్గుతారు. గ్రామాల నాదర్శవంతంగా తీర్చిదిద్ది భావిభారత నాయకత్వానికి అర్హులవుతారు. దేశపునర్నిర్మాణంలో సంపూర్ణ భాగస్వాములై అభివృద్ధి కార్యక్రమాలను జయప్రద మొనరించినవారౌతారు. ఆనాడు దేశానికి, యువజన సంఘానికి పుష్టి లభించుతుంది. మన జాతీయ లక్ష్యమైన సోషలిజం దగ్గర పడుతుంది.



# క్రీడారంగం: కొన్ని సూచనలు

శ్రీ లావు అంకమ్మ చౌదరి

రెండువందల సంవత్సరాల బ్రిటిష్ పాలన మన దేశాన్ని రాజకీయంగానూ, ఆర్థికంగానూ సాంస్కృతికంగానే గాక క్రీడా రంగాన్ని కూడా అధ్వాన్న స్థితికి తెచ్చింది.

మనదేశంలో జీవన ప్రమాణాం చాలా తక్కువైనందున, ఉద్యోగ వసతులు అల్పమైనందున విద్యార్థులలో వ్యాయామాసక్తి సన్నగిల్లి పోతున్నది. బ్రతుకుకోసం ఉద్యోగం, ఉద్యోగంకోసం చదువు తప్పితే, జీవితానికి పునాదియైన ఆరోగ్యం గురించి శ్రద్ధ వహించలేక పోతున్నారు. బాల్యావస్థనుంచే ఆరోగ్యంగా బలాఢ్యులై యుండటానికి పునాదులు వేయవలసిన ఆవశ్యకతను కేంద్ర రాష్ట్రప్రభుత్వాలు కూడా గుర్తించినట్లు లేదు.

మనదేశంలో బ్రిటిషు వారి హయాంలోగాని, యిప్పుడుగాని క్రీడలు విద్యాలయాలల్లో ఒక జాతీయోద్యమంగా నిర్వహించి నడపబడటంలేదు నిర్బంధశిక్షణ ప్రభుత్వం అమలులోకి తీసుకురానందువల్ల ఆసక్తి వున్నవారుమాత్రం స్వంత కృషి వల్లనే యింతవరకు పైకి వస్తున్నారు. తత్ఫలితంగా అనేకమంది అర్థికాధి వసతులులేక,యిబ్బందికి గురికావలసి వస్తుంది.

10 సంవత్సరాలనాడు స్వాతంత్రం వచ్చియున్నా, క్రీడారంగం చెప్పుకోదగ్గ అభివృద్ధి సాధించలేము. మన మాతృదేశానికి కీర్తి, ప్రతిష్టలు తెచ్చే విధంగా మన వ్యాయామ క్రీడలు అభివృద్ధిలోకి తేవటానికి ప్రభుత్వంవారు తీవ్రకృషి చేయాల్సివుంది. వ్యాయామక్రీడలు జాతి ఆరోగ్యం వృద్ధి పరచాలనే లక్ష్యంతో అభివృద్ధి చేయాలి. యిందులో ప్రావీణ్యం జూపుతున్న వారికి ప్రత్యేక శిక్షణ యివ్వాలి. 15 సంవత్సరముల వయస్సు వచ్చేటప్పటికి ఏదో ఒక వ్యాయామ క్రీడలో ప్రత్యేక శిక్షణ పొంది యుండటానికి విద్యాలయాలలో వ్యాయామ క్రీడలను ఒక సబ్జక్టుగా తీసుకొని పరీక్షా విధానం ప్రవేశపెట్టి కనీసపు సూత్రాలను నిర్ణయించాలి.

## పోటీలు

అన్నిరకాల క్రీడల అభివృద్ధికి, క్రీడాకారుల నైపుణ్యాన్ని పెంపొందించటం విషయంలోనూ, వారి మధ్యమంచి సోదరభావాన్ని, నిజమైన మైత్రిని పటుతరం చేయడంలోనూ ఈ ఆటల పోటీలకు ప్రత్యేక ప్రాముఖ్యముంది. ఈ క్రీడల కార్యక్రమములో, యువజనుల క్రీడల పోటీలు అన్నిటికంటే ముఖ్యమైన స్థానాన్ని అలంకరిస్తూ వుంటాయి. వీటిలో, విడివిడిగా క్రీడాకారులు మొత్తం జట్లు జట్లుగా పాల్గొంటుంటారు అందువల్లనే ఎక్కడ, ఎప్పుడు పోటీలు జరుగుతున్నా వందల వేల సంఖ్యలో యువజనులు పాల్గొంటున్నారు.

ఇలా క్రీడోత్సవాలు విరివిగా జరిపినందువల్ల పరస్పర సహకార స్నేహభావాన్ని కలిగించడానికి, వారి ప్రతిభను ప్రదర్శించడానికి మంచి అవకాశం కల్గుతుంది.

పోటీలలోని ముఖ్య విషయం ఎన్ని పతకాలు సాధించుకున్నదన్న విషయం ప్రధానం కాదు. వివిధ దేశాల రాష్ట్రాల మధ్య, వివిధరకాల అభిప్రాయాలు కలవారి మధ్య వారి మైత్రీ, సౌభ్రాతృత్వాలనూ పటిష్టం చేయడానికి, ఒకరి అనుభవాలను మరొకరు తెలుసుకోడానికి యీ పోటీలు మంచి అవకాశాన్ని కలుగజేస్తాయి.

వ్యాయామక్రీడలలో కొన్ని ప్రమాణాలు నిర్ణయించి అందులో ప్రతిభ ప్రదర్శించినవారిని ఘనంగా సన్మానించడమేగాక, ప్రథమ, ద్వితీయ, తృతీయ తరగతులుగా విభజించి వారిని దేశవీరులుగా గుర్తించే కొన్ని పతకాలు యివ్వటం ప్రవేశపెట్టాలి.

ఈనాడు మనదేశాన్ని పీల్చి పిప్పిచేయుచున్న జాడ్యాలలో అనైక్యత, అసూయ, విద్వేషము, దురభిమానము మొదలైనవి ప్రధానంగావున్నా వీని ప్రభావం యువజనుల లేత హృదయాలమీద పడుట, తత్ఫలితంగా యువజనులలో కూడా వివిధ రకాల దుష్టపరిణామాలు సంభవించుచున్నవి.

ఆసియా ఆటల పోటీలు ముగిసిన తర్వాత ప్రధాన మంత్రి జవహర్లాల్ నెహ్రూ విలేఖరులతో ప్రసంగించుతూ టీములలో సమర్థత కలిగినవారిని చేర్చుకొనుట జరగలేదనీ, క్రీడారంగములో గూడా అంతరంగిక విభేదాలు, ముఠా ద్వేషాలు ప్రవేశించుట చాలా దురదృష్టకరమనీ తమ విచారమును వెల్లడి చేశారు.

ఇప్పటికైనా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు మేల్కొని మరొకసారి యిలా జరగకుండా తగిన చర్య తీసుకోవడమేగాక

1962లో ఇండోనేషియాలో జరిగే నాల్గవ ఆసియా ఆటల పోటీలకు ప్రఖ్యాతిపొందని మన ఆంధ్ర వెయిట్ లిఫ్టర్లను పంపుతారని ఆశించుదాము.

## రెండవ పంచవర్ష ప్రణాళిక

ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో వ్యాయామకళాశాలలను ప్రారంభించటానికి, వివిధరకాల ఆటల అభివృద్ధికి భోజన, వసతి గృహాలకు 2 కోట్ల రూపాయలు కేటాయించటం, అందులో 80 లక్షలు ఖర్చుపెట్టడం జరిగింది. ఇతర దేశాలను పోల్చుకుంటే యిది చాలాస్వల్పం. ఇప్పటికి ఖర్చుపెట్టిన రు 80 లక్షలలో ఆంధ్రదేశానికి చిల్లిగవ్వకూడా లేకపోవటం మరీ విచారకరం. ఇందులో కొంత సద్వినియోగమైనా, ఎక్కువమందికి ఉపయోగపడటం లేదనేది వాస్తవం. కేటాయించిన రెండుకోట్లయినా అన్ని రాష్ట్రాలకు సక్రమంగా పంచి ఉపయోగపడేటట్లు చూడాలి.

## ఆసియా ఆటల పోటీలు: భారతదేశ స్థానం

ప్రథమ ఆసియా ఆటల పోటీలు ఢిల్లీలో జరిగాయి. భారతదేశం అన్నింటిలో పాల్గొని 10 స్వర్ణ పతకాలు; 10 రజతపతకాలు; 6 కంచుపతకాలు సాధించి పోటీలలో ద్వితీయ స్థానం అలంకరించింది. జపాన్ 11 స్వర్ణపతకాలు; 12 రజిత పతకాలు; 12 కంచుపతకాలు సంపాదించి పోటీలలో ప్రథమ స్థానం సంపాదించింది.

ద్వితీయ అసియా ఆటలపోటీలు 1952 లో "మనిలా" లో జరగటం, దానికి ఆంధ్రవెయిట్ లిఫ్టర్లను పంపకపోవటం

ఫలితంగా భారతదేశం 4 స్వర్ణపతకాలు, 3 రజతపతకాలు, 5 కంచుపతకాలు, మాత్రమే పొంది 4 వ స్థానం సంపాదించింది.

1953 లో "టోకియో"లో జరిగిన తృతీయ ఆసియా ఆటల పోటీలలో భారతదేశం 5 స్వర్ణపతకాలు; 4 రజతపతకాలు; 4 కంచుపతకాలు సంపాదించి 7 వ స్థానాన్ని అలంకరించింది. అంతేగాక గత 30 సంవత్సరాల నుంచి మన దేశానికి కీర్తి, ప్రతిష్ఠలు తెచ్చి, ప్రపంచ ప్రఖ్యాతి గడించిన మన హాకీజట్టు ఈసారి పరాజయం పొందడం భారతీయులను కలతపెట్టింది

దీనినిబట్టే దేశంలో వ్యాయామక్రీడలు పురోగమించడానికి బదులు తిరోగమన మార్గాన పడ్డాయని చెప్పవచ్చు. ఇప్పటికైనా దీనిని గమనించి ప్రభుత్వంవారు ఆయా క్రీడలను అభివృద్ధిచేసే సంస్థలు దీర్ఘంగా ఆలోచించి సరైన పద్ధతులు అవలంబించి వ్యాయామ క్రీడల అభివృద్ధి కృషి సాగిస్తారని ఆశిద్దాం.

(1) క్రీడా సంస్థలద్వారా సమైఖ్యమయ్యే అవకాశం సంఘటితమయ్యే అవకాశం యువజనులకిస్తూ, ప్రభుత్వం నిబంధన తయారుచేయాలి. ఈహక్కును పొందటానికి అనేక క్రీడాస్థలాలు, శిక్షణశాలలు ప్రభుత్వం నిర్మించడమేగాక వీటికి సమస్త సామాగ్రి, క్రీడాపరికరాలు ఉచితంగా సమకూర్చాలి. (2) జిల్లా ముఖ్యపట్టణాల్లో క్రీడాస్థలాలు, శిక్షణశాలలు వెంటనే నిర్మించి వాటికి కావలసిన సమస్త సామగ్రి ఉచితంగా ప్రభుత్వంవారు సప్లయిచేయాలి. (3) ఒక వయో

పరిమితి నిర్ణయించి ఆ మేరకు నిర్బంధ శిక్షణ యివ్వటం విద్యాలయాలలో వ్యాయామ క్రీడలను ఒక సబ్జెక్టుగా తీసికొని పరీక్షా విధానం ప్రవేశపెట్టాలి. ఇందులో ప్రావీణ్యం సంపాదించిన వారికి ప్రత్యేకశిక్షణ గరపాలి. (4) జాతీయ పోటీలలో నెగ్గినవారిని ఘనంగా సన్మానించి ప్రథమ, ద్వితీయ, తృతీయ తరగతులుగా విభజించి దేశవీరులుగా గుర్తించే కొన్ని బిరుదులు అందులో నిపుణత చూపిన వారికి యివ్వాలి. (5) ప్రతి సంవత్సరం క్రీడోత్సవం జరపాలి. ఆరోజు ప్రభుత్వం వారు శలవు ప్రకటించాలి. (6)ఇతర దేశాలు వెళ్ళే క్రీడాకారుల ఖర్చులు ఆయా రాష్ట్ర ప్రభుత్వాలుగాని, లేదా అవి నిర్వహిస్తున్న క్రీడా సంస్థలుగాని భరించాలి (7) వ్యాయామ క్రీడలు జాతి ఆరోగ్యం వృద్ధిపరచాలనే లక్ష్యంతో బాల్యావస్థనుంచి ఆరోగ్యంగాబలాఢ్యులై యుండటానికి పునాదులు వేయాలి. (8) "మేధాశక్తిని శారీరక శక్తితో పదును పెట్టాలి" అనే గ్రీకు సిద్ధాంతాన్ని ధ్యేయంగా పెట్టుకుని వ్యాయామ పథకాలు అమలుపరచాలి.



# యువకులు : నాటక ప్రదర్శనలు

శ్రీ చిగుమపాటి వీరయ్య

యువజనోద్యమాన్ని పునర్నిర్మించాల్సిన ప్రాముఖ్యత, అందరమూ గుర్తిస్తున్నాము. పునర్నిర్మించేముందు వారి అభిరుచులను గమనించాలి. వారి అభిరుచులలో ప్రముఖ స్థానము వహించేవి వైజ్ఞానిక కార్యక్రమాలు.

1945 లో యువజన సంఘాలు, "ప్రజా నాట్యమండలి" నిర్మాణాత్మకంగా కృషిసల్పి గ్రామ జీవితాన్ని చిత్రించే నాటకాలు, నాటికలు, నృత్య సమిష్టి గానాలు, గేయాలు, బుర్రకథలు, జముకుల కథలు ప్రదర్శించి ఆంధ్ర ప్రజల మన్ననలనేగాక అఖిలభారత కీర్తి నార్జించాయి. రంగ ప్రయోగంలో మార్పులు, నటకులలో వాస్తవిక నటనాశక్తి పెంపొందించుట, సామాన్య మానవునకు అందుబాటులో ఉండే వర్తమాన సమస్యలను ఇతివృత్తాలుగా తీసుకొనుట, యివన్నీ నాటకరంగంలో ఒక నూతన విప్లవాన్ని తెచ్చినవి. ప్రజా జీవిత సమస్యలు ప్రదర్శించి ప్రజల సమస్యలను ప్రజలే పరిష్కరించుకొనే మార్గాలను జూపి వారిని చైతన్యవంత మొనర్చగల్గింది. కరువు కాటకాలు సంభవించిన ప్రాంతాలకు యితర ప్రాంతాలలో ప్రదర్శనలిచ్చి ధన, ధాన్య రూప

ములో వారికి సహాయముజేసి ప్రజల అభిమానాన్ని చూర గొన గల్గినది. కళాపరిషత్తు వార్షికోత్సవ పోటీలలో బహుము తులంది కళాకారు లందరి అభిమానాన్నీ చూరగొన్నది. ప్రజానాట్యమండలి ఉచ్ఛస్థితిలో నున్నపుడు ప్రభుత్వ దమన నీతివల్ల ఛిన్నాభిన్నమై పోయినది. అయినా నేటికీ దాని ప్రభావం మన నాటకరంగంమీాద పనిజేస్తూనే యున్నది.

ఈ మధ్య గత కొలది సంవత్సరాలుగా యువజనో ద్యమంతోబాటు నాటక కళారంగంలో తాత్కాలికంగా కొంత నిస్తబ్ధత ఏర్పడింది. యిటీవల రెండు, మూడు సంవత్స రాలనుండి ఎన్నో సాంఘికనాటకాలు, నాటికలు వస్తూనే యున్నవి. అవి అంత విశిష్టంగా లేవు. దుస్థితిలో మునిగిన తర్వాత కోలుకోడానికి కొంతకాలం పడుతుంది. ప్రథమ ప్రయ త్నాలలో లోపాలుండవచ్చు. అయినప్పటికీ ప్రయత్నాలను హర్షించి దోహదమివ్వాలి. వీటిని ప్రదర్శిస్తున్నవారు యువ కులే. అంతేగాక విద్యార్థులుకూడా యిటీవల ఎక్కువగా నాటకకళపట్ల ఉత్సాహాన్ని ప్రదర్శిస్తున్నారు. కొత్తనాట కాలు చదివి కొత్తధోరణికి అలవాటు పడడం విద్యార్థులకు సులభ సాధ్యమైనట్లు యువకులకుగాదు. విద్యార్థులు కూడా ముందుకు వచ్చి వేసవి శెలవల్లో యువకులతో సమిష్టిగా నాట కరంగ పునర్నిర్మాణ కార్యకలాపాలు కొనసాగించాలి. వారికి కావలసిన సిద్ధాంత పరిజ్ఞానం అందివ్వాలి. విద్యార్థులు, యువ కులు దళాలుగా ఏర్పడి కొత్తనాటకాలు తయారుజేసి, గ్రామ ప్రజలకు అభిరుచి గల్గిన రూపాలను ప్రవేశపెట్టాలి. క్రొత్త రచయితలను రంగంమీాదికి తీసికొని రావాలి.

ఉదాహరణకు ఒక గ్రామంలో ప్రదర్శన యివ్వండి. దానినుండి ప్రజలు పొందిన ప్రబోధం ఏమిటో పరిశీలించండి. ఆ నాటకంమీద వారికి అభిరుచి గల్గినదా' అని ప్రశ్నలు వేసి కొన్నపుడు ఆ గ్రామీణ జీవితంలో ఏ ఏ సమస్య లున్నవో ఆలోచించి వాటిని ప్రతిబింబించే ప్రదర్శనలివ్వాలి. ప్రస్తుత నాటకరంగంలో ఆ అభివృద్ధి చాలతక్కువ. త్రాగుడుతో చితికిపోయే వారి గాథలు, వరకట్నాల బాధకెరఅయ్యే కుటుంబగాథలు, అస్పృశ్యతా నివారణ, లంచగొండితన నిర్మూలన, గ్రామ పారిశుద్ధ్య సమస్యలు, ప్రజలు ఆరోగ్య పద్ధతులను అలవర్చుకొనే క్రమము, కులమతాల పేరిట గ్రామాల్ని చీల్చి పాలించేవారి పోకడలు, శాంతి మొదలైన సమస్యలను ప్రజలకళ్ళముందర చిత్రించి వారిని చైతన్యవంత మొనర్చాలి.

రచయిత నాటక సంఘాలకు, ప్రజలకు దూరమయితే మంచి నాటకాలు వెలువడవు. తమ కళ్ళముందరి వాస్తవ జీవితాల్ని పరికించి వాటికి నాటకరూపం యిచ్చిననాడే అవి ప్రజాదరణ పొందగలుగుతాయి. అప్పుడే మన వైజ్ఞానిక రంగంలో ఎక్కువ అభివృద్ధి సాధించినవారమవుతాము. యువకులను మూఢాచారాలనుండి మళ్ళించగలుగుతాము. ప్రదర్శకులు ఎక్కువగా సంక్రాంతి, దీపావళి, దసరా, సంవత్సరాది పండుగలకు ప్రదర్శనలను యివ్వవచ్చును. అదే సమయాల్లో జరిగే కోడిపందాలు, జూదాలు మొదలగు వాటి నుండి యువకులదృష్టిని మరల్చవీలవుతుంది. వాగ్వివాద పోటీలు, చర్చలు కొనసాగించి పండుగల సమయంలో వార్షి

కోత్సవాలు జరిపి ఆ పోటీలలో నెగ్గినవారికి పుస్తకాలు మొదలైన బహుమతులిచ్చి వారి వారి ఉత్సాహాన్ని పెంపొందించాలి.

గ్రామాల్లో నాటక సమాజాలు ఆర్థికంగా హీనస్థితిలో నున్నవి. దీనికితోడు స్త్రీ పాత్రల విషయం ఒక సమస్యగా తయారయింది. స్త్రీలను గూడ ప్రోత్సహించి, నాటకరంగంలో ప్రవేశింపజేసి వారి నెదుర్కొనే సమస్యలుగూడా ప్రదర్శించాలి దీనికి సమాజాలు, నటులు ఆదర్శప్రవర్తన అలవరచుకోవటం ముఖ్యంగా అవసరం. ప్రదర్శనలలో టిక్కెట్లుపెడితే వాటికి విలువున్నట్లు కొన్ని సమాజాలు భ్రమపడుచున్నవి ఆ విధంగా ప్రదర్శించుటవలన సమాజాలు ఆర్థికంగా చితికిపోయి మళ్ళీ మళ్ళీ ఆ రంగంజోలికి పోనిపరిస్థితి ఏర్పడుతుంది. కాబట్టి ప్రదర్శన లిచ్చుటలోగూడా నూతన పద్ధతులను అనుసరించాలి.

గ్రామంలో నెలకు ఒక రూపాయి సభ్యులను ఒక వందమందిని చేర్పించండి. రెండు మాసములకు ఒక ప్రదర్శన యివ్వండి. లేదా ప్రదర్శన యిచ్చి తదుపరి ప్రతి యింటికి వెళ్ళి వసూలు ప్రారంభించిన తగిన సహాయము యివ్వడానికి ప్రజలు అలవాటు పడుతారు. యువకులుగూడా ప్రజల దైనందిన కష్టాల్లో భాగస్వాములై వారి ఆదరణను పెంచుకొనగలరు. గ్రామాల్లో అనుభవాన్ని తీసికొన్నపుడు నూతక్కి గ్రామంలో మొదట్లో వైజ్ఞానిక ప్రదర్శన లిచ్చి ప్రజల్లో ఎక్కువ ఆదరణ పొందగలిగారు. నాటకాలు ఆడుటకు ప్రజల నుండి చందాలు వసూళ్ళకు పూనుకొన్నారు.

జాతీయ వికాసకేంద్రాలవారు నాటక ప్రదర్శనాలకు యిచ్చే ఆర్థిక సహాయమువల్ల కొంతధనాన్ని సంపాదించారు. బ్లాకులున్న ఏరియాల్లో కొద్ది సమాజాలు మాత్రమే దానిని వినియోగించుకొన గల్గుతున్నవి. ఎక్కువగా ఉపయోగించుకొనుట లేదు. మంగళగిరి బ్లాకులో మంగళగిరి "అభ్యుదయ నాట్యమండలి" రు. 200 రూపాయలు బ్లాకునుండి రు 200లు ప్రజల చందాలద్వారా వసూలుజేసి మొత్తం రు 400 రూపాయల జంత్ర వాయిద్యాలు సేకరించుకొన్నది. తదితర గ్రామాలుగూడా అలాటి సహాయాలను వినియోగించుకోవాలి. నాట్యమండలి సభ్యులు ఐక్యతను ప్రదర్శించి సుహృద్భావంతో మెలగాలి. ఇతర సమాజములకు సహాయ సానుభూతులందించాలి.

పై విషయాలను నాటక సమాజాలు, నటకులు, యువకులు పరిశీలించి ఔత్సాహిక నాటకరంగ పునరుజ్జీవనానికి తోడ్పడాలి. అప్పుడే మన యువజనోద్యమంగూడా వెల్లివిరుస్తుంది.



•

# దేశ సంక్షేమం : యువజన సంఘాల పునర్నిర్మాణావశ్యకత

శ్రీ కడియాల గోపాలరావుగారు

(రాష్ట్ర యువజనోద్యమ సంస్థాపకులు)

అభ్యుదయ ఉద్యమాలన్నింటిలోనూ యువకులే ప్రముఖపాత్ర వహిస్తారని చరిత్ర చాటుతోంది. ప్రజలూ దేశమూ ఎదుర్కొంటున్న ప్రతి ప్రధాన సమస్యలోను అవసరమైన నూతన సందేశాన్ని తీసుకోవడం, ప్రచారంచేయడం, నిలబడడం, వ్యతిరేకశక్తులను ఎదుర్కోవడం మొదలైన పనులలోను శక్తివంతంగా నిర్వహించేది ఈ యువశక్తులే అనేది నిర్వివాదాంశం.

ఆంధ్రరాష్ట్రంలో 1935 నుండి రాష్ట్ర వ్యాపితంగా యువజనులను సంఘటితపరుస్తూ రాష్ట్ర యువజన సంఘం అవతరించింది శాంతి, స్వాతంత్ర్య, ప్రజాతంత్ర ఉద్యమాల అభివృద్ధికి ఎంతో తోడ్పడింది. యువతీ యువకులను అభ్యుదయ పథంలో పెట్టడానికి ఎంతో కృషిచేసింది. యువజనుల దురభ్యాసాలను, మూఢనమ్మకాలను తొలగించి విజ్ఞానాభి

వృద్ధికి తోడ్పడి శాస్త్రీయ దృక్పథాన్ని కలుగజేసింది. యువ కులను ఆదర్శపౌరులుగా చేస్తూ, ప్రజలకు సేవచేస్తూ యువజన సంఘాలు పెద్దల ఆమోదాన్ని పొందాయి. గ్రామాలలోను, పట్టణాలలోను జరిగే దోపిడీ దౌర్జన్యాలను ఎదిర్చి నిలబడి ప్రజలకు తోడ్పడ్డాయి.

అనేక సందర్భాలలో ప్రజలకు కష్టకాలంలో అండగా నిలబడ్డాయి. వారికి చైతన్యం కలుగచేయడానికి తోడ్పడ్డాయి. ఈవిధంగా ఒకవైపున దేశసేవ ప్రజాసేవచేస్తూ రెండోవైపున యువజనులు ఆర్థిక, రాజకీయ విద్యావైజ్ఞానిక క్రీడారంగా లలో అభివృద్ధి గాడానికి కృషి చేశాయి. వివిధ రంగాలలో ఎన్నో సత్సాంప్రదాయాలను నెలకొల్పాయి. తర్వాత '42 '47, '52 సంవత్సరాలలో యింకా అనేక యువజన సంఘాలు వివిధ నామాలతో వివిధ గ్రూపులతో సంఘటితం చేయబ డ్డాయి యువజన కాంగ్రెసు, యువకర్షక సమితి, యువక సమాజ్, సమాజవాదీ యువజన సంఘం, భారత్ సేవక సమాజ్ మొదలగు సంఘాలు వచ్చాయి. ఏదో కొంతకాలం, కొన్ని ప్రాంతాలలో పరిమితమై పనిచేశాయి. కాని అన్ని సంఘాల కార్యక్రమాలు ఈనాడు స్తంభించి వున్నాయి. రాష్ట్ర యువజన సంఘంకూడా నామమాత్రమయిపోయింది. అక్కడక్కడ గ్రామస్థాయిలోను, తాలూకా స్థాయిలలో, కొన్ని పేటలలో, పట్టణాలలో యువజన సంఘ కార్యకలాపాలు జరుగుతున్నాయి.

గత 20 సంవత్సరాలలో యువజనోద్యమం సాధించిన విజయాలు; ప్రవేశపెట్టిన సత్సాంప్రదాయాలు, ఉత్తమ

ఆదర్శాలు, ఉన్నత నైతిక విలువలు మన కళ్ళముందే పతన మైపోతున్నాయి యువకులు పెడమార్గాలు పడుతున్నారు. శారీరకాభివృద్ధికి తోడ్పడుతున్న ఆటలపోటీలు మాని పేకాట లలో, జూదపుశాలలో ప్రవేశిస్తున్నారు. ప్రభుత్వ అనుమతి తోనే ప్రారంభమయిన క్లబ్బులలో (జూదపుశాలలు) చదువు కున్న యువకులే ప్రధానపాత్ర వహిస్తున్నారు. మరల యువ కులలో వ్యభిచారం, త్రాగుడు ఎక్కువైనాయి అభ్యుదయ సాహిత్యపఠనం తగ్గింది.చౌకబారు సాహిత్యపఠనం హెచ్చింది ఆదర్శ వివాహాల పద్ధతికి స్వస్తిచెప్పి యువకులు కట్నమునే వివాహమునకు ప్రధానంగా భావిస్తున్నారు. కులతత్వాలకు సంకుచిత భావాలకు గురి యవుతున్నారు. సాంఘిక సంస్కర ణలకు పాటుపడడంగాని, ప్రజలకు చైతన్యం కలుగచేయటం గాని జరుగుటలేదు. నేడు యువకుల నెదుర్కొంటున్న గడ్డుసమ స్యల సరియైన పరిష్కారమునకు సంఘ బలంతో నిలబడకుండా అవకాశవాద ధోరణితో స్వార్థపరులవెంట తిరగడం జరుగు తూంది. వైజ్ఞానిక రంగం వెనకబడింది. ఈవిధంగా ఒకనాడు యువజనోద్యమం గ్రామసీమలలోను, పట్టణాలలోను, వివిధ రంగాలలోసాధించిన అభివృద్ధిదెబ్బతింటోంది.నవభారత నిర్మా ణంలో ప్రముఖపాత్ర నిర్వహించాల్సిన యువశక్తులువృధాగా పోవటం, పెడమార్గాలుపట్టడం జాతి భవిష్యత్తుకే ప్రమాదం. లక్షలు కోట్లసంఖ్యలో యువజనులు నిరుద్యోగులై యున్నారు. వీరు నిరుత్సాహ నిస్పృహాలతో యున్నారు. నిరుద్యోగం, అజ్ఞానం, మూఢవిశ్వాసాలు మొదలైనవాటికి గురైన యువతీ యువకులతో నిండియున్న దేశంలో వ్యవసాయ పారిశ్రామి

కాభివృద్ధిని గాని, నూతన ఆర్థికవ్యవస్థను నిర్మించటంగాని రెండో పంచవర్ష ప్రణాళికా లక్ష్యాలను సాధించటంగాని సాధ్యంగాదని వేరుగా చెప్పనవసరం లేదు. అందుచేత ఈనాడు మనదేశంలో యువకులను యువజన సంఘాలలో, పునస్సంఘటిత పరచవలసిన చారిత్రక అవసరం ఏర్పడింది.

నవశక్తులు, పురోగామి శక్తులుగానున్న ఈ యువజనులు దేశభక్తితో, సృజనాత్మక శక్తితో చేసే కృషిమీదనే మనదేశ భవిష్యత్తు ఆధారపడి వుంది. వీరు ఉత్తేజంతో దేశపునర్నిర్మాణ కార్యక్రమానికి ఉపక్రమించడానికి కావాల్సిన భౌతిక పరిస్థితులను కల్పించాలి; కల్పించుకోవాలి. అలానే దేశములో జరిగే అభివృద్ధిపైనే యువకుల భవిష్యత్తు ఆధారపడి యుంది. యువజనాభివృద్ధి, జాతీయాభివృద్ధి ఒకదానితో నొకటి పెనవేసుకొనియున్న ఈ సందర్భంలో ఈ యువశక్తు లన్నింటినీ ఐక్యపర్చి యువజన సంఘాలను నిర్మించవలసిన అవసరం అవకాశాలు ఎంతగానో ఉన్నాయి.

## యువజన సంఘాల నిర్మాణం

విభిన్న రాజకీయాభిప్రాయాలను గల యువకులను, ఏ రాజకీయాభిప్రాయాల ప్రమేయం లేనివారినీ, సాంఘిక సంస్కరణలకోసం పాటుబడేవారిని కళాకారులను, రచయితలను, క్రీడాకారులను మొదలగువారినందరినీ ఒకే వేదికపైపు తీసుకువచ్చి బలమైన యువజన సంఘాలను నిర్మించడానికి అవకాశముంది. ఇదివరలో శాంతి, స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యం అభ్యుదయం కావాలనుకొనేవారిని, యువజనులు ఆర్థిక, రాజ

కీయ, విద్యా, వైజ్ఞానిక క్రీడారంగాలలో అభివృద్ధికి తోడ్ప డాలని అంగీకరించి అందుకు పాటుబడేవారిని యువజన సంఘా లలో చేర్చుకొనేవారు. కాని ఈనాడు సోషలిస్టు ఆశయాన్ని సూత్రప్రాయంగా అన్ని రాజకీయపార్టీలు ప్రభుత్వంకూడా అంగీకరించటం జరిగింది. దేశభక్తులు ప్రజాతంత్రవాదులు ఆర్థిక అసమానత్వం పోగొట్టి నూతన వ్యవస్థాపనకు అంగీక రిస్తున్నారు. అందుచే నేడు యువజన సంఘాల ఆశయాలలో శాంతిస్వాతంత్ర్య అభ్యుదయాలతోపాటు సోషలిజాన్నికూడ చేర్చవచ్చు అప్పుడే నేడు భారతదేశంలో నున్న వాస్తవిక పరిస్థితులకు అనుగుణ్యమైన కార్యక్రమంతో, లక్ష్యాలతో బలమైన యువజన సంఘాలను నిర్మించగలం. యువజన సం ఘాలు లేనందువల్ల వచ్చిన అనర్థకాలను, జాతీయ పునర్ని ర్మాణంలో విజృంభించి పాల్గొనవలసిన యువశక్తులు వృధాగా నిరుత్సాహంగా ఉండటం జాతీయాభివృద్ధికి హానికరమని రాజ కీయపార్టీలు, ప్రజాసంస్థలు, ప్రజాతంత్రవాదులు ప్రభుత్వం కూడ గ్రహించి యువజనోద్యమానికి చేయూత నివ్వాలి. యువజనుల నెదుర్కొంటున్న చిక్కు సమస్యలను పరిష్కరిం చుటకు సాయపడాలి.

## రెండో పంచవర్ష ప్రణాళిక - ప్రభుత్వ విధానాలు- యువజనులు

దేశంలోనున్న యువశక్తులకు అవసరమైన భౌతికపరి స్థితులు కల్పించి సక్రమమార్గాన మరల్చి జాతీయ పునర్ని ర్మాణానికి పూనుకొనేలా చేసినట్లయితే ఈనాడు పరిస్థితి వేరుగా వుండేది. ఒకనాడు దేశభక్తితో జాతీయోద్యమంలో,

ఆంధ్రరాష్ట్ర సాధనలో, గోవావిముక్తి పోరాటంలో, ప్రజా తంత్ర ఉద్యమాల్లో ఎంతో పాత్రవహించిన యువజనులు నేడు ఎందువల్ల నిస్తబ్ధతలో వున్నారు? గత పదకొండు సంవత్సరాలనుండి జాతీయ ప్రభుత్వమున్నా యువజనుల సమస్యలను పరిష్కరించి ఉత్తేజపరచలేదు. (పంచవర్ష ప్రణాళిక ఆశయాలను యువకులంతా అంగీకరిస్తున్నా) లక్షలమంది చదువుకొన్న యువకులు నిరుద్యోగులై నిరాధారంగావున్నారు. చదువురాని యువకులు యింకా ఎక్కువ సంఖ్యలో పని లేకుండా యున్నారు. ఈరకంగా అపార యువశక్తి ప్రణాళికను జయప్రదం చేయడానికి ఉపకరించకుండా వ్యర్థమవుతోంది. యువకులను ప్రోత్సహించడానికి, శారీరకాభివృద్ధి చేయడానికి ప్రభుత్వం తాలింఖానాలు, క్రీడాస్థలములు ఏర్పరచుటలేదు. జూదపు శాలలు, కాటన్ మార్కెట్లు, త్రాగుడు మొదలగు దురభ్యాసాలకు యువకులు గురికాకుండా ప్రభుత్వ యంత్రం తగు జాగ్రతలు తీసుకొనడంలేదు. విద్యావిధానాన్ని కూడ జాతీయాభివృద్ధికి తోడ్పడే రూపంలో వ్యవస్థను అభివృద్ధి చేయడానికి పూనుకుంటూనే మన ఆర్థిక విధానంపై సామ్రాజ్యవాదులకు గల పట్టును దెబ్బతీయడం లేదు. దేశంలో సామ్రాజ్యవాదుల దోపిడీ యథాతథంగా సాగిపోతూనేవుంది. అందుచే ప్రభుత్వ మవలంబించే విధానాలు యువజనుల సమస్యలను పరిష్కరించనూలేదు. వారిని ఉత్తేజ పరచనూలేదు. ఒకవైపునైనా ప్రజాప్రభుత్వం తమ దేశంలో ఒక వ్యక్తి ఒకరోజు సోమరిగా వున్నా జాతికి అనర్థదాయక మనే సూత్రంపై ఆధారపడి అందరికీ పని కల్పిస్తూంటే మన

దేశంలో లక్షల యువజనులను నిరుద్యోగులుగా మన ప్రభుత్వం వుంచుతోంది. అందరికీ పని కల్పించే విధానాలను అమలు జరుప నిరాకరిస్తోంది. భూసంపదను, ప్రకృతి సంపదను, మానవ సంపదను సద్వినియోగం చేయుటలేదు ఆర్థిక వ్యవస్థలో మౌలిక మార్పులు తీసుకువచ్చి అధికారాలను, సంపదలను ప్రజలపరం చేయ నిరాకరిస్తోంది. మాటలకు, చేతలకు సంబంధం లేకుండా వుంది.

యువజన సంఘాలలో విశాలమైన ప్రాతిపదికపై కుల, మత రాజకీయ విభేదాలు లేకుండా యువజన సంఘాల ఆశయాలను, కార్యక్రమాలను అంగీకరించే వారినందరినీ చేర్పించాలి. బలమైన ఐక్యయువజనోద్యమం నిర్మించడానికి యీ దిగువ కార్యక్రమాన్ని ప్రాతిపదికగా తీసుకోవాలి.

1. సామ్రాజ్యవాదులు సాగించే యుద్ధ ప్రయత్నాలకు వ్యతిరేకంగా శాంతి రక్షణకు యువజనుల్లో, ప్రజల్లో ప్రచారం గావించాలి. ఉద్యమం నిర్మించాలి. వలస ప్రజల విముక్తి పోరాటానికి తోడ్పడాలి. మన దేశ ప్రజలను సమీకరించాలి. మన ప్రభుత్వం గట్టిగా నిలబడేలా చేయాలి.

2. ఆసియా, ఆఫ్రికా దేశాల సమావేశాన్ని చొరవతో భారత దేశ ప్రభుత్వం జరపాలని, సామ్రాజ్య వాదులకు వ్యతిరేకంగా జరిగే జాతీయోద్యమాలకు వస్తాదుగా నిలబడాలనీ ప్రజాసమీకరణ చేయాలి.

3. రెండవ పంచవర్ష ప్రణాళికను అధ్యయనంచేసి అందుగల స్కీములను ప్రజల కుపయోగించే రీతిగా అమలు

జరిపేటట్లు యువజన సంఘాలు చొరవతో కలుగజేసుకొని పనిచేయాలి. ఆ పరిమిత ప్రయోజనాలను ప్రజల కందించాలి. యువజనోద్యమాని కుపయోగించే భాగాలను సరిగా వినియోగించుకోవాలి. నిర్దిష్టమైన సూచనలిస్తూ వాటిని బలపరచేందుకు ప్రజాభిప్రాయాన్ని సమీకరించాలి.

4. యువకుల విజ్ఞానాభివృద్ధికి తోడ్పడాలి.

(అ) యువకుల్లో మూఢనమ్మకాలు, దురాచారాలు పోగొట్టడానికి వారి విజ్ఞానాభివృద్ధికి పాటుబడి శాస్త్రీయ దృక్పథాన్ని కలుగజేయాలి.

(ఆ) పత్రికలు పుస్తకములు, తదితర అభ్యుదయ సాహిత్యాన్ని పఠించుటకు పఠన కేంద్రాలను గ్రామాల్లోను, పట్టణాల్లో వేర్వేరు కేంద్రాల్లోను తెరవాలి.

(ఇ) గ్రామాల్లోకూడ చదువుకొన్న యువకులు పెద్ద సంఖ్యలో వున్నారు. వీరిమధ్య చర్చలలోనూ, వక్తృత్వంలోను, వ్యాసరచనలోను పోటీలు జరపాలి.

(ఈ) విజ్ఞాన యాత్రలద్వారా యువకులను అదివరలోనున్న పొరపాటు పంథాలనుండి మరల్చడానికీ, విజ్ఞానతృష్ణను ఎక్కువ చేయడానికి సహాయపడతాయి. అందుచే యువజన సంఘం తరఫున నందికొండ, మాచ్‌ఖండ్ మొదలగు ప్రాజెక్టులవద్దకు, పంచదార, సిమెంటు ఫ్యాక్టరీలకు, భిలాయ్ మొదలగు పెద్ద ఫ్యాక్టరీలవద్దకు తీసుకుపోవాలి.

(ఉ) వైజ్ఞానిక సాంస్కృతిక సభలు జరుపుతుండాలి. యువరచయితలను, కళాకారులను సత్కరించి ప్రోత్సహించాలి.

(ఊ) చాలా గ్రామాలలో గ్రంథాలయాలు యిదివరకే వున్నాయి. ఇపుడు ప్రతి గ్రామంలోను పంచాయతీ తరఫున గ్రంథాలయాలు తెరుస్తున్నారు. అందుచే యీనాడు క్రొత్త గ్రంథాలయాలను తెరిచే సమస్యకంటే ఉన్న గ్రంథాలయాలను ఉపయోగించుకొనడమే యువజనసంఘాలముందు ప్రధాన సమస్యగా వుంటుంది. ఉన్న గ్రంథాలను సక్రమంగా సరఫరా చేసే ఏర్పాటుచేసి యువతీ యువకులందరిలో చదివే సాంప్రదాయాలను ప్రవేశపెట్టాలి అవసరమైన నూతన సాహిత్యాన్ని తెప్పిస్తూ గ్రంథాలయాలను నిర్వహించే బాధ్యతను యువకులే తీసుకోవాలి.

## వైజ్ఞానిక కార్యక్రమాలు

యువకులకు వైజ్ఞానిక కార్యక్రమాలంటే అభిలాష ఎక్కువ. 1947 వరకు ప్రజానాట్యమండలి సహకారంతో యువజన సంఘాల తరఫున యెన్నో వైజ్ఞానికదళాలు తయారయ్యాయి. ప్రజల జీవిత సమస్యలు తీసుకొని ప్రజలకు వివిధ కళారూపాలద్వారా సేవ చేశారు. లక్షలమంది ప్రజల మన్ననలను పొందారు. మరల గ్రామగ్రామాన పట్టణాల్లోను వైజ్ఞానిక దళాల్లోకి యువకులను సమీకరించాలి. దీనిద్వారా యువకులను దురభ్యాసాలనుండి మళ్ళించడమేగాక ప్రజలకు రాజకీయ ఆర్థిక సాంఘిక సమస్యలపై సరియైన దృక్పథం కలుగజేసి చైతన్యవంతులను చేయవచ్చు. అందుచే మరల నాటికలు, నాటకాలు, బుర్రకథలు మొదలైన కళారూపాలను పునరుద్ధరించాలి.

## ఆటల కార్యక్రమం

యువజన సంఘాలద్వారా యువజనుల శారీరకాభివృద్ధికి తోడ్పడాలి. ఆటలకు వ్యాయామానికి యువకులను ఆకర్షించాలి. గ్రామాల్లోను, పేటల్లోను చెడుగుడు, మోకు లాగుట, బరువులెత్తుట, పరుగులు తీయుట, ఎత్తుదూకుట, ఈత, వాలీబాల్, ఫుట్ బాల్ మొదలైన ఆటలపోటీలు పెట్టి తర్ఫీదు చేయించాలి. మన ఆంధ్రలోనున్న నిపుణుల నాహ్వానించి వారితో శిక్షణ పొందాలి. గ్రామాల్లోను పేటల్లోను క్రీడాస్థలములను, ఆటవస్తువులను పొందుటకు పంచాయతీ బోర్డుల, మ్యునిసిపాలిటీల సహకారాన్ని తీసుకోవాలి. నేడు పెద్ద ఎత్తుగా పేకాటల్లో మునిగిపోయిన యువకులను ఆ దురభ్యాసంనుండి మరల్చడానికి ఆ కేంద్రాలలో క్యారంబోర్డు, చదరంగం మొదలైన వాటిని ప్రవేశపెట్టాలి.

## గ్రామసీమల్లో యువజన సంఘాల కర్తవ్యం

గ్రామాల్లో స్వార్థపరులైన పెత్తందారులు కులకక్షలతో, ముఠా రాజకీయాలతో గ్రామప్రజల ఐక్యతను విచ్ఛిన్నం చేస్తుంటారు అక్కడ యువకులను కులతత్వాలకు ముఠా రాజకీయాలకు గురికాకుండా ఐక్యపరచి ఆ విచ్ఛిన్నధోరణుల ప్రమాదాలను ప్రజలచే గ్రహింపజేసి ప్రజా ఐక్యతకు పాటుపడాలి.

గ్రామసీమల్లో నేడు సమాజవికాస కేంద్రాలు, జాతీయ విస్తరణ స్కీములద్వారా యువజన సంఘాలు కొన్ని

సహాయాలు పొందవచ్చు. వయోజన పాఠశాలలను నడపడానికి సహాయాన్ని పొందవచ్చు. క్రీడా స్థలాలు, ఆటవస్తువులు కొనడానికి కొంత ధనసహాయం పొందవచ్చు. అలాగే వైజ్ఞానిక కార్యక్రమాల కుపయోగించే హార్మోనియం, తబలా, ఫిడేలు మొదలగు పరికరాలను కొనడానికి ధనసహాయం పొందవచ్చు. రీడింగురూములు తెరవడానికి, పత్రికలు కొనడానికి సహకారాన్ని తీసుకోవచ్చు. బ్లాక్ ప్రాంతంలో యువజన సంఘాలు అధికారులతోను ప్రజలతోను సన్నిహితసంబంధం పెట్టుకోవాలి.

యువకులు కష్టకాలంలో ప్రజలకు తోడ్పడుతూ ప్రజాసేవకులుగా గుర్తించబడాలి. త్రాగుడు, జూదం, మూఢ విశ్వాసాలు మొదలగు వాటిని పోగొట్టడానికి కృషిచేయాలి. వారిలో విజ్ఞానప్రచారంద్వారాను, వయోజన విద్యాలయాల ద్వారాను అజ్ఞానాన్ని పోగొట్టి చైతన్యం పెంపొందించాలి. ప్రజలు ఐక్యంగా సమష్టి కార్యక్రమాలను సాగించుకునే సాంప్రదాయాన్ని పెంపొందించాలి.

అంటువ్యాధులు వచ్చినపుడు యువజనసంఘాల తరఫున ఆరోగ్య సూత్రాల ననుసరించి తీసుకోవాల్సిన జాగ్రత్తలను గూర్చి చెప్పడం మందులు సరఫరా చేయాలి. ఆ సమయాల్లో జరిగే జంతుబలులు, జాతరలు వగైరా మూఢాచారాలను మాన్పించాలి.

## సంఘసంస్కరణలు

స్త్రీ పురుషులమధ్య ఆర్థిక సాంఘిక సమానత్వము, వరకట్నాలు విచక్షణ చూపని ఆదర్శ వివాహాలు, అస్పృ

శ్యతా నివారణ మొదలైన సంస్కరణలకోసం గతంలో యువజనోద్యమం కృషి చేసింది. మనం వాటిని పునరుద్ధరించి మరింత ఉన్నతస్థాయికి తీసుకుపోవాలి.

ఆంధ్రప్రదేశ్ యువజన సమాఖ్య పేరుతో యావదాంధ్రలోను యువజనోద్యమాన్ని పునర్నిర్మించాలని 1958 సెప్టెంబరు 20, 21 తేదీలలో గుంటూరులో జరిగిన ప్రదేశ్ యువజన కార్యకర్తల సమావేశంలో ఏకగ్రీవంగా నిర్ణయించారు.

ఆ సమావేశానికి రాష్ట్రం నలుమూలలనుండి 60 మంది కార్యకర్తలు హాజరయ్యారు.

ఆంధ్రప్రదేశ్ యువజన సమాఖ్యను నిర్మించాలనీ, డిసెంబరు 20, 21 తేదీలలో విజయవాడలో రాష్ట్రయువజన సమాఖ్య సదస్సు జరపాలనీ నిర్ణయించారు.

సదస్సు జరిగేలోగా సంస్థ నిర్మాణ కార్యకలాపాలు నిర్వహించేందుకు గాను ఒక ఆర్గనైజింగు కమిటీని ఎన్నుకున్నారు. ఖమ్మం, వరంగల్లు, నల్లగొండ జిల్లాలనుండి జిల్లాకొకరుచొప్పున సభ్యులను కోఆప్టు చేసుకొనేందుకు ఆర్గనైజింగు కమిటీకి అధికార మిచ్చారు.

## భారత యువజన సమితి

దేశంలో అన్ని యువజన సంఘాల ప్రతినిధులతో కూడిన దేశంలోని యువజనులందరికి ప్రాతినిధ్యం కల్గిన భారత జాతీయ యువజన సమితిని నిర్మించవలసిందిగా భారత ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు.

ప్రపంచ యువజనులమధ్య స్నేహ సౌభ్రాతృత్వాలను దృఢతర మొనరించేందుకు, సుస్థిర శాంతిసాధనకు దోహదకారి కాగల ప్రపంచ యువజనోత్సవాలను బలపరుస్తూ తీర్మానించారు.

## స్టేడియముల నిర్మాణం

యువజనుల శారీరక, మానసిక, సాంస్కృతి కాభివృద్ధులకు దోహదం చేసేందుకుగాను ఆటస్థలాలు, స్టేడియములు, ఓపెన్ ఎయిర్ థియేటర్లు ఏర్పాటు చేయవలసిందిగా అన్ని మునిసిపాలిటీలకు విజ్ఞప్తి చేశారు. యువజనులకు ఆటస్థలాలు, ఆటవస్తువులు సమకూర్చవలసిందిగా గ్రామ పంచాయితీలన్నింటిని కోరారు.

పట్టణాలలో ఉన్న మురికిపేటల బాగుచేతకు తగు చర్యలు గైకొనవలసిందిగా ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు.

కుల మత తత్వాల వ్యాప్తిని అరికట్టేందుకు, రూపుమాపేందుకు పూనుకోవలసిందిగా ఆంధ్ర యువతీ యువకులకు విజ్ఞప్తి చేశారు.

వయోజన రాత్రి పాఠశాలలకు గ్రాంట్లు ఇచ్చేపద్ధతిని పునరుద్ధరించవలసిందిగా ప్రదేశ్ ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు.

రాష్ట్ర పరిపాలనా వ్యవహారాలన్నీ తెలుగులోనే కొనసాగించేందుకు అవసరమైన చర్యలు తక్షణమే గైకొనవలసిందిగా ఆంధ్రప్రభుత్వాన్ని కోరారు. యూనివర్సిటీ దశలో బోధనా భాషగా తెలుగును ప్రవేశ పెట్టవలసిందిగా కోరారు.

యువజనసమస్యల పరిష్కారానికి,జాతీయపునర్నిర్మాణ కార్యక్రమాన్ని జయప్రద మొనరించేందుకు ఐక్యంగా కృషి జరిపేందుకు ఆంధ్రప్రదేశ్ యువతీ యువకులకు పిలుపు నిస్తూ తీర్మానించారు.

## సంఘ సంస్కరణలు

కేవలం శాసనాలతో సంస్కరణలు అమలు జరగవనే విషయాన్ని గమనించి, వరకట్నాల సమస్యకు మూలకారణ మైన స్త్రీ పురుషుల ఆస్తి హక్కులలో గల అసమానతను సంపూర్ణంగా తొలగించేందుకు చర్యలు గైకొనాలని తీర్మా నించారు.

రిక్రియేషన్ క్లబ్బుల పేరుతో రిజిష్టరు చేయబడుతున్న క్లబ్బులు, అనేక సందర్భాలలో యువజనులను దురభ్యాసా లకు, దుర్వ్యసనాలకు బలిచేసే కార్యకలాపాలకు ఆలవాలమై వుండడాన్ని అత్యంత విచారంతో గమనిస్తూ, అట్టి దుష్ప్ర భావాలను అరికట్టేందుకు చర్యలు గైగొనవలసిందిగా రాష్ట్ర ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు.

ద్వితీయ పంచవర్ష ప్రణాళికద్వారా చేకూరగల ప్రయోజనాలను ప్రజలకు అందుబాటులోకి తెచ్చేందుకు, ప్రణాళికా విజయానికి తోడ్పడేందుకు కృషి చేయాలని ఆంధ్రప్రదేశ్ యువతీయువకులకు విజ్ఞప్తి చేశారు.

**Yuvajanodyamam : Neti Samasyalu :** Price : **31 n. P.**




Wrapper Printed at Swatantra Art Printers, Vijayawada-2.